Regd No. H. 41 / M. 3813

103434

విడిపత్రిక ౦-౧-౨

మా గ్రంథాలు
ఉద్యోగ విషాదము వెల ౯ అణాలు.
X యోగ శాస్త్ర భాష్యము వెల ౪ అణాలు
గోల్కొండ పత్రికాలయం.

# గోలకొండ పత్రిక

అహారసమస్య ధరల నిర్ణయం
కర్త: మందుముల నరసింగరావు
వెల 1—8—0
మాడరన్ బుక్ డిపో
సుల్తానుబజారు హైదరాబాదు.

ప్రతి సోమ, గురువారములందు వెలువడు అర్ధవార జాతీయ పత్రిక

సంపుటము ౧౭ ● హైదరాబాదు దక్కన్ శా. శ. ౧౯౨౪ స్వభాను భాద్రపద బ ౧౦ (౧౭ ౧౨ ౧౩౫౨ ఫ) గురువారము ● సంచిక ౩౬

## అనేక ద్వీపాలలో మిత్రమండలి సేనలు దిగుట

### మధ్యధరా సముద్రమందు చర్యలు

#### పసిఫిక్ ప్రదేశము

పసిఫిక్ ప్రదేశమందు అమెరికనుల సేనలు సాలమాన్ విమానాశ్రయమును, సాలమానాను ఆక్రమించినవి. ఆరెండు చోట్లనుండి పారిపోవుచున్న జపానీయ సేనలు అమెరికనుమిత్రమండలివారిముట్టడిలో చిక్కుకొనినవి.

న్యూగినీలో జపానువారివశములో మిగిలియున్న, ముఖ్యస్థానము 'లే' అనునది ఒక్కటియే. దానికి తూర్పున, పడమటను, దక్షిణమునను మిత్రమండలివారి సేనలు సమీపించి సెప్టెంబరు ౧౬-తేదీన ఆక్రమించినవి.

న్యూగినీలో సిగ్నాప్రదేశమును పట్టుకొనిన తర్వాత ఆస్ట్రేలియను సేనలు అక్కడ జపానీయ సైనికులను ఖైదుచేయుటకై వెదకగా ౧౧౦౦ మంది జపానీయ సైనికులు తుపాకులతో తమతలలను తామే ప్రేలగొట్టుకొని చచ్చిపడియుండుట కానవచ్చెను.

#### ఇతర రంగములు

చైనాలోను బర్మాలోను జపానీయులవశమందున్న ప్రదేశములపై బ్రిటిషువారి, అమెరికనుల విమానాల దాడులు తప్ప మరేవిశేషములు గాని లేవు. అమెరికను విమానాలు ఈ చైనాలో దక్షిణ హునానురాష్ట్రములో యున్నసిఖ జిల్లాపై దాడి చేయగా ౧౧౦౦ జపానీయ నావికులు చచ్చిరి.

ఆగస్టు ౩౧ తేదీన ఎల్లిసుదీవులలో ఫునాటిలో అమెరికనుల ముఖ్యస్థానముపై జపానీయ విమానాలు దెబ్బలను వేయుగా రెండు అమెరికను జలాంతర్గామినౌకలు మునిగిపోయినవి.

పారముషిరా అనుచోట నౌకాముఖ్యస్థానముపై సెప్టెంబరు ౧౩ తేదీన అమెరికను విమానాలు బాంబులను వేయుటచే ఒక అమెరికను నౌక ప్రేలిపోయెను. మూడు అమెరికను నౌకలు చెడిపోయెను.

జర్మనీపైనను జర్మనుల ఆక్రమణలోనుండు ఫ్రాన్సు మొదలగు మున్నగు యూరపుఖండపు దేశాల మీదను బ్రిటిషు విమానాలు తిరుగుచు ఆదేశముల యందు జర్మనుల యుద్ధప్రయత్నములకు ఉపకరించుచున్న పరిశ్రమలు మున్నగునవిగల ప్రదేశములన్నిటిమీదను బాంబులను వేయుచు నష్టములను కలిగించుచున్నవి.

... ...

యుద్ధవిషయమును గురించి స్టాలినుగారితో బ్రిటను, అమెరికాల ప్రతినిధులు కలిసి సంభాషణలు జరుపు ఏర్పాటు చేయు విషయమై రాయబారములు జరుగుచున్నట్లు రూజ్వెల్టుగారు సెప్టెంబరు ౧౪ తేదీన ఒప్పుకొనినారు.

... ...

అర్జెంటైనాలో విదేశాంగమంత్రి రాజీనామా నిచ్చినాడు. వరల అక్కడ ఏదో తిరుగుబాటు ఏర్పడినట్లు ఒక సమాచారమువచ్చినది. అర్జెంటైనా సేనలు అక్షరాజ్యాలను ఓడించుటకు సరిగా ఉపయోగపడుట లేదని అమెరికావారు దానికి ఆయుధములు సహాయమును చేయుట నిరాకరించినారు.

#### యుగోస్లావియాలో భీషణమైన పోరాటము

యుగోస్లావియాలో దేశభక్తుల సేన మాంటినీగ్రో తీరముపొడవునను జర్మనుపక్షపు సేనలను ప్రతిఘటించి భీషణముగా పోరాడుచున్నది. స్ప్లిటు సమీపములో మూడు జర్మను ఓడలు నౌకలు ముంచివేయబడినవి. క్రోషియనులు హెర్జగోవినాలో లోమెట్కోవిష్ వరకుపోయినారు. సర్బియా, బల్గేరియాలమధ్య సరిహద్దు సమీపములో చాలాసేనలు జర్మనుసేనలపై దెబ్బలను వేసినవి. వియన్నా, బుడపెస్టు, బెల్గ్రేడు సోఫియా, సాలొనీకాలకుండాపోవు రైలుబాట గ్రీసులోని జర్మనుసేనలకు కావలసినసామగ్రులను పంపుటకు పనికివచ్చును. ఆబాటను అనేకస్థానములందు తెగగొట్టినారు. కాపాయానా ప్రదేశమును ఆక్రమించినారు.

#### దోదెకనీస్ దీవులలో మిత్రమండలి సేనలు దిగుట

దోదెకనీసు దీవులలో తూర్పుకొసన తుర్కీ సముద్రతీరమునుండి యెనభై నాలుగు మైళ్ళలోను రోడ్సునుండి యెనభై ౧౦ మైళ్లదూరమందు కాస్టెలోరిజో అనుదీవి బ్రిటిషువారివశమైనది రోడ్సుకుఉత్తరములో ౧౦ మైళ్ళలోను తుర్కీనుండి మూడుమైళ్ళదూరమునందుండు సామోసు దీవిలో సెప్టెంబరు ౧౬ తేదీన బ్రిటిషు సేనలు దిగినవి.

#### సార్డినియాను జర్మనులు వదలివేయుట

సార్డినియాలో ఇటాలీయులతో పోరాడుట యొక్క ఫలితముగా అక్షరాజ్య జర్మనుల సేనలు సార్డినియానుండి పూర్తిగా తరిమి వేయబడినవి. అవి కార్సికాకు వెళ్లిపోయినవి.

#### కార్సికాలో జర్మనులు

జర్మను సేనలు కార్సికాయొక్క ఆగ్నేయ భాగమును ఆక్రమించినవి. అక్కడి జర్మనుసేనలకు సహాయబలములు ఎల్బాదీవులనుండి ఇంకను, ఎక్కువగా చేర్చబడుచున్నవి.

కార్సికాలో ఫ్రెంచివారి కామాండో సేనలు దిగినవి. ఇటలీవారు బ్రిటిషుపక్షముతో యుద్ధవిరామసంధిని చేసికొనిరను సంగతి తెలియగనే కార్సికాలో ఫ్రెంచి నాయకులు జర్మనులతో పోరాటమును ప్రారంభించిరి. ఫ్రెంచి కామాండో సేనలు అటుపిమ్మట వచ్చి దిగినవి. ఇటాలీయులు కార్సికాలోని గొరిల్లా వర్గములతో కలిసి జర్మనులతో పోరాటమును చేయసాగిరి. ఇటాలీయులకు మిత్రమండలివారు ఆయుధములు మున్నగు యుద్ధసామగ్రి నివిరివిగా యిచ్చిరి. ఇపుడు ఆఖరకు మిత్రమండలివారి సేనలే కార్సికాపై దండయాత్ర చేయుటకు దిగినవి ఈ దీవిలో విమానాశ్రయములు మంచివి కలవు, మంచి ఓడరేవులున్నవి. ఇది ఫ్రెంచివారి దీవి. ఇటలీకి ౧౦౦ మైళ్ళ దూరములో నున్నది. జర్మనీతో యుద్ధములో ఫ్రాన్సు ఓడినతర్వాత, కార్సికాలోని ఓడరేవులపై ఇటాలీయులను జర్మనీయులను కలిసిన ఒక ఉపసంఘమునకు అధికారములభించెను ౧౯౪౨ నవంబరులో మిత్రమండలి సేనలు ఉత్తరఆఫ్రికాలో దిగినపుడు, కార్సికాలో ౫౦ వేల ఇటాలీయుల సేనలు దిగి దండయాత్ర చేసియుండెను.

— —

## అమెరికాలో ఇండియాలీగుకు చైనీయుడు అధ్యక్షుడు

న్యూయార్కు, సెప్టెంబరు ౧౬

అమెరికాలోని ఇండియాలీగుకు లిన్ యుటాంగ్ అను చైనీయనాయకుడు గౌరవాధ్యక్షుడుగా ఎన్నుకొనబడినాడు. ఆయన ఆలీగుయొక్క అధ్యక్షుడగు జె. జె. సింగుగారికి ఇట్లు వ్రాసినాడు:-

"ఈ అసాధారణ గౌరవమునకు చైనీయుని నన్ను ఎన్నుకొనినపుడు ఇండియాయొక్క సమస్య ఆసియా దేశములకును సంబంధించిన సమస్యయని మీరు అనిపించియుండవలెను, ఇండియాయొక్క స్వాతంత్ర్యముకొరకు అందరును కృషిచేయవలసినవారే తన దేశముయొక్క సమస్యలను తానే పరిష్కరించుకొనుటకు రాజకీయ స్వాతంత్ర్యము లేకుండచేయబడి యుండుట ఎంత అవమానకరమో అంత అవమానకరమైనది మరొకటిలేదు. మీరు మొదట ఆహుతుచ్చుకొనుటకై పోరాడవలెను. ఇండియాకు ఎవ్వరును గాని పెట్టకుండ స్వాతంత్ర్యము నీయవలెనని నా మతము"

— —

## బ్రిటనులో స్త్రీలసంఖ్య ఎక్కువ

### అందుకై బహుపత్నీత్వపద్ధతి కావలెనను వాదము

బ్రిటనులో పురుషుల సంఖ్యకంటె స్త్రీల సంఖ్య ౨౦ లక్షలెక్కువగనున్నది. ఈ చిక్కునుతొలగించుటకుగాను ఆదేశము సి-ఇ-యం జోడ్ అను తత్వశాస్త్రజ్ఞుడొక్కరు అనేకులు స్త్రీలను వివాహమాడవచ్చునని అభిప్రాయమిచ్చినాడు. "ఎక్కడికైనను భోజనమునకుపోవునపుడు వెంటనుండుటకై ఒకతె, దేశాటనమునకుపోవునపుడు వెంటనుండుటకై ఇంకొకతె, పోషణచేయుటకై మరొకతె ఆటలాడుటకు నాలుగవది, రంభాగానుండుటకు ఐదవది-ఇట్లు వివిధలక్షణముల స్త్రీలు నాకు సహచారిణులుగానుండుట నాకిష్టము. అనివారు చెప్పిరి.

— —

## మాంసమునకై పశువులను చంపుట

ఇండియాప్రభుత్వమువారు ౧౦ ఏండ్లవయస్సునకు లోబడి మంచిఆరోగ్యమునందున్న ఎద్దులను చంపుట నిషేధించుటకు ఆహారపదార్థముల ప్లానింగు కమిటీవారు, గావించిన శిఫారసును అంగీకరించినట్లు తెలియుచున్నది. కాని ఆవులను, చూడిఆవులను చంపరాదు. పశువధశాలలను ఏర్పాటుచేసియుంచిన సరకారుసంఘములు పశువధకు గురియించిన తమ ఉపాధియందు ముందుగా మార్పు చేయుటకై కోరబడినవి.

— —

## ఊరేగింపులు: అరెస్టులు

సూరతు, సెప్టెంబరు ౧౦

రాంపూరా మెయిన్ రోడ్డునుండి రూపాలాటెర్రా వైపు అధికారుల అనుమతిలేకుండ ఊరేగింపు నొకదానిని నడిపిరని ముగ్గురిని అరెస్టు చేసినారు. వీరు అనవపాలినుండి వచ్చినవారలట. ఊరేగింపులోని జనులను పోలీసులు తరిమివేసిరి.

కేశవలాల్ భాయ్ వందుజను నాతనిని అరెస్టు చేయుటకై వారెంటు జారీఅయియుండెను. కాని అతడు పోలీసులకు చిక్కకుండ తప్పించుకొని తిరుగుచుండెను. అతనుఆఖరుకు స్వయముగా వచ్చి రామొదటితరగతి మేజిస్ట్రేటుగారికి తనను తాను పరచుకొనినాడు.

పోలీసులకు చిక్కకుండ తిరుగుచున్న జయభాయ్ గిలానీ పాటక్ పరిషతు ఒక నెలలోగా తనవద్దకు వచ్చి హాజరు కావలెనని రామొదటితరగతి మేజిస్ట్రేటుగారు ఆజ్ఞాపించినారు.

(యు-ప్రె)

# గోలకొండపత్రిక

స్వభాను సం॥ర భాద్రపద బ॥ ౧౦ గురువారము


# స్థానిక పరిపాలనము

ఇకముందు హైదరాబాదు రాజ్యములో లోకల్‌ఫండు అను పేరు తుడిచివేయబడును దానికిమారుగా స్థానిక పరిపాలనము అని వ్యవహరించవలెనని నిన్న మొన్ననే ప్రభుత్వమాజ్ఞాపించినది. పేరుమారితే స్వభావము మారినట్లా అను విషయమే విచారణీయమగును. బ్రిటిషిండియాలో స్థానిక స్వపరిపాలన మని అంటారు. మనవారున్నూ ఇంగ్లీషులో అదేఅర్థము వచ్చు (Local self Government) లోకల్ సెల్ఫ్‌గవర్నమెంటు అని వ్రాసియుండిరి. కాని యిప్పటి ఉర్దూఆజ్ఞలో "మొఖామీహుకుమత్" అని వ్రాసినారు అనగా స్థానికపరిపాలనము అనిఅర్థము ఇంతవరకు మనరాష్ట్రములో లోకల్‌ఫండు వ్యవహారపద్ధతి ఏమిన్నీ తృప్తికరముగా లేకుండెను. ఈ లోకల్‌ఫండు విశేషముగా రైతులపన్నుతో నిండినకోశము కలిగియున్నది. కాని రైతులకు అందు ప్రవేశములేకుండెను. వారి కోరికలు విచారించినవారు లేరు. తహసీల్దార్ సాహెబ్‌గారు తమ ఆస్థానములో తమకు నచ్చిన నలుగురిని ఏరుకొని తన దర్బారును సాగించేవాడు. అతను మించిన పనిమేమిన్నీ లేకుండెను. ఇక యీ కొత్తరాజ్యాంగ శాసనముల ప్రకారం ఏర్పడే కమిటీలు మునిసిపాలిటీలుకొన్ని కొత్తపన్నులు వేయగలవు. కాని పాత లోకల్‌ఫండుపన్ను రద్దుకానందున అది ప్రధానముగానేయుండును. ప్రధానముగానుండినప్పుడు రైతుల కేమైనా అందు పలుకుబడికలదా అంటే లేదని అనవలెను. ఈవిషయములో మార్పు కానరాదు. మనరాష్ట్రములో ఏ ఇటలీలోనో యుండినట్టి (కార్పొరేటు) వర్గప్రాతినిధ్యపద్ధతిని మతముతో మేళవించి కొన్ని చిక్కుబందీలుఅష్టదిగ్బంధనాలు చేసిఒకనూతనస్వరూపముతో రాజ్యాంగమును ప్రసాదించినారు. అట్టి వర్గప్రాధాన్యముకల ఎన్నికలలో ఈ స్థానిక పాలనములో భూస్వాములగు వ్యవసాయకులనుచేర్చనేలేదు. ౫౦౦౦ వేలకు మించిన జనసంఖ్యగల పట్టణాలలో వారెందుకుండరందురేమో? వారు న్నూ ఉందురని అనుకొనుచున్నాము. కాదని నిరూపించినచో సంతోషింతుము ఒకవేళవారు తక్కువగానేఉందురనుకొందము కూలీలకు, స్త్రీలకు, పకీర్లకు, వైద్యులకు ప్రాతినిధ్యమిచ్చినారుకదా. వారేమి వృత్తిపన్ను కాని తలపన్నుకాని యిచ్చుచున్నారా? రూపాయికి అణాప్రకారం వారిఆదాయంపైన వసూలుచేయుచున్నారా? రైతులనుండి లోకల్‌ఫండు వసూలును వదలివేసి వానికి ప్రాతినిధ్యమున్నూ వదలివేయవచ్చును. రైతుకు కమిటీలలో ప్రధానస్థానముండవలెను

౧౫౦౦౦జనసంఖ్యకు మించి స్థలాలలోను జిల్లాప్రధానస్థలములలోను మునిసిపాలిటి లేర్పడును. అనగా మనరాష్ట్రములో ౧౬ జిల్లాప్రధానస్థలాలున్నవి. ౧౦ వేలనుండి ౩౦ వేల జనసంఖ్యకలవి ౨౬. కావున ౫౦౦౦కన్న ఎక్కువజనసంఖ్యగలవి. జిల్లాప్రధాన స్థలములు పోగా మిగులునవేవియు కావు. ౨౦ వేలనుండి ౫౦ వేలవరకు జనసంఖ్యకలవి ౬. ౫౦ వేలనుండి ౧ లక్ష జనసంఖ్యగలవి ౨ ఈ ప్రకారము ఇంచుమించు ౨౫ స్థలములలో మునిసిపాలిటీ లేర్పడును. ౫౦౦౦ నుండి ౧౫ వేలవరకు జనసంఖ్యగల పట్టణాలలో టౌన్‌కమిటీలు (పట్టణసమితులు) అను పేరుతో (బ్రిటిషిండియాలోని తాలూకాబోర్డులకు ప్రత్యామ్నాయము అనుకొనవచ్చును) ఏర్పాటగును. ౫౦౦౦ నుండి ౧౦ వేలజనసంఖ్య పట్టణాలు ౬౪. మరియు ౧౦ వేలనుండి ౨౦ వేలవరకు ౨౬. కావున పట్టణ సమితులు ఇంచుమించు ౯౦ పట్టణాలలో ఏర్పాటగును. మనరాష్ట్రములో ౧౪౪ వరకు తాలూకాలున్నవి. అయినా ౯౦ స్థలాలలో ఏర్పాటగుచున్నవికదా అని సంతోషింతము బ్రిటిషిండియాలో జిల్లాబోర్డులు తాలూకాబోర్డులు కలవు మనకు ప్రాదేశిక ప్రాతినిధ్యము (Terretorial representation) గిట్టనే గిట్టదుకదా అందుచేత జిల్లాబోర్డులమాటలేదు తాలూకాబోర్డులకు మారుగా పట్టణసమితులు సృష్టియైనవి.

అయితే యీవిధమగు జనసంఖ్యగల పట్టణాలన్నింటిలో సమితి ఏర్పడితీరునని అనుకోరాదు. ప్రభుత్వానికి కోపమువస్తే కొన్నిరద్దగును. కొన్ని ఆపివేయబడును. సూబేదారుకు కోపమువచ్చినా కష్టమే అతనికి సరిపడనినిర్ణయాలను రద్దుచేసే అధికారమిచ్చినారు. అయితే సుబేదారు శాసనముపైన ప్రభుత్వమువద్ద మొరపెట్టుకొనవచ్చునులే అనిఅన్నారు. సమితివారు ఏదైన అసహ్యకర మైనట్టియు (Nuisance) లేదా ప్రజాశాంతిభంగకరమైనట్టి నిర్ణయమునుచేస్తే సుబేదారు ఆ నిర్ణయాన్ని రద్దుచేయగలడట, ఇందు బ్రిటిషిండియా శాసనాల అనుకరణము కానవచ్చుచున్నది. అసహ్యకరమైనదంటే ఎట్టిదో తెలుపలేదు. సభ్యతకలిగి ప్రజలచే ఎన్నుకొనబడిన పెద్దలకు అసహ్యమగు నిర్ణయాలు చేయునట్టి దుర్బుద్ధియెందుకు పుట్టును? మరి ప్రజాశాంతి భంగకరమగుమాట అతివ్యాప్తి దోషములను చేయునట్టిది. బ్రిటిషిండియాలో ప్రభుత్వానికి సరిపడనట్టి నిర్ణయాలను కొన్నిమారులు ఇట్టి సాకుచేతనే రద్దుచేయుచూ వచ్చినారు మన పట్టణకమిటీపెద్దలు ప్రజాశాంతి ఎందుకు కావింతురు అయినా ప్రభుత్వమువారు ఈ అధికారాలను చాలా అరుదుగా చెలాయించవలసియుండును

ఇంతవరకు సంస్థానాలలో జాగీర్లలో, పాయిగాలలోకూడా లోకల్‌ఫండుమాత్రము తప్పకుండా సక్రమంగా వసూలుచేయుచూ వచ్చినారు. ఖాల్సాలోనే ఎన్నికలనేవి లేనప్పుడు జాగీరీ ఇలాకాలలో ఉండబోవనక్కరలేదు చాలాపొరపాటు ఇప్పటి స్థానిక పాలనముయొక్క పద్ధతినిచూస్తే ఇకముందు జాగీరు ఇలాఖాలలో కూడా మునిసిపల్‌కమిటీలు పట్టణ కమిటీలు ఏర్పాటుచేయుదురనిస్పష్టమగుచున్నది. ఈస్థానిక పాలనము ఏర్పాటుచేసినందున ప్రభుత్వమువారి అభిప్రాయములో "తదభివృద్ధిమార్గములో ఒక ముఖ్యమైన అడుగు వేయడమయినది." పూర్వపులోకల్‌ఫండు పరిపాలనముకంటె ఈ స్థానిక పరిపాలనములో కొంత మంచుకు పోవడం కానవస్తున్నది. ముందుకు పోవడమంటే ఇక సంస్కారాలెందుకు అయితే ఆపోవడములో చిమనడక ఉన్నదా రైలువేగమున్నదా లేక ఎటుకాని బండినడక యున్నదా అన్నదే ప్రశ్న. ఈపరిపాలనముయొక్క పద్ధతినిగురించి మరికొన్ని ముఖ్య విషయములనుగూర్చి మరల చర్చింతుము.

---

## హైద్రాబాదు రేడియో
## తెలుగు కార్యక్రమం

౧౬వఆగష్టునుండి ౨౫వతేదీ తెలుగువార్తల సమయం ౧౦గంటల ౫౫నిమిషాలనుండి ౧౦గంటల౧౫నిమిషాలవరకు ౨౫వఆగష్టునుండి తెలుగు వార్తలసమయం ౯గంటల ౫౫నిమిషాలనుండి ౧౦గంటల ౫నిమిషాలవరకు.

౧౯వతేదీ ౧౩౫౩ ఫ. ౨౫ వసెప్టంబరు ౧౯౪౩ శనివారం సమయం ౫గంటల౪౫నిమిషాలనుండి ౬గంటల ౧౫నిమిషాలవరకు రికార్డుసంగీతం, సంగమం. శ్రీ వైజానారాయుడుగారు, రికార్డుసంగీతం

మంగళవారం, ౨౨వ ఆబాన్ ౧౩౫౩ ఫ ౨౮వ సెప్టంబరు ౧౯౪౩ సమయం. ౫-౪౫నుండి ౬-౧౫వరకు సంగీతం, రుద్రమదేవి. కుమారిహేమలతాజీవరత్నంగారు, రికార్డుసంగీతం,

శనివారం, ౨౬వఆబాన్ ౧౩౫౩ఫ. ౨అక్టోబరు ౧౯౪౩ సమయం ౫గంటలనుండి ౫.౩౦వరకు, ఆధునిక కవిత్వంలోని రసనిష్యంద్యాలు. కావ్యగానం

మంగళవారం, ౨౯వఆబాన్ ౧౩౫౩ ఫ, ౫వ అక్టోబరు ౧౯౪౩ సమయం: ౫గంటలనుండి ౫.౩౦వరకు రికార్డుసంగీతం, మానవోపకారులు, (ఉపన్యాసపరంపర) "మార్కోని" శ్రీ మదన్ మోహన్‌గారు, సంగీతం.

---

## హైద్రాబాదు స్మశానప్రబంధకసమితి

పైసమితియొక్క మొదటి సమావేశము శ్రీ, బాబాపూరన్ దాసుగారి మరమునందు శ్రీ రాజబహద్దర్ రాయెవిశ్వేశ్వరనాథుగారి ఆధ్యక్షతన ఈ నెల ౧౦ తేదిసాయంత్రము జరిగెను.

(౧) పైసమితి కార్యాలయము. రాజబహద్దర్ రాయెవిశ్వేశ్వరనాథుగారి గృహమునందు పగలు ౨గంటలనుండి సాయంకాలము ౬ గంటలవరకుండును, ౨౫ రూపాయిలవేతనముపైన, గుమాస్తాను, మరియు ౧౫రూపాయిలపైన భృత్యునినియమించుటకు సభవారు అంగీకరించిరి

(౨) భూన్నిమియాబజారు స్మశానసమితి యొక్క శోకపైనకట్టెలఏర్పాట్లను ఈసమితితమ స్వాధీనము చేసికొనెను మందుకు కట్టెలఏర్పాటు కొరకు, రెండువేలరూపాయిలను ఖర్చుచేయుటకు అంగీకరించుచు, ఒక ఉపసంఘమును నియమించిరి. హైద్రాబాదులోనున్న స్మశానములనుండి కట్టెఏర్పాటులవిషయమున ఒక ప్రణాళికను మాసములోగా ఏర్పర్చుటకు ఒక ఉపసంఘమును నియమించిరి.

---

## సిద్ధాంత వాతావరణము
### (టి.వి.భాస్కర్‌గారు, ఆరోగ్యాశ్రమము భూతుపూరు.

౨౭, సెప్టంబరు సోమవారము ఈదినముహస్తకార్తి ప్రవేశము శీతమతగ్గును. మనోహరముగనుండును వర్షముకూడ కలుగును

౧. అక్టోబరు ఆశ్వీ శు ౩ శుక్రవారము ఈదిన ముఉష్ణముతగ్గును. ఆకాశము మేఘములచే నిండియుండును వర్షము లుగును.

౨. అక్టోబరు ఆ శు ౩ శనివారము ఈదినము చల్లగానుండును. కొద్దివర్షముకూడ కలుగును. మేఘములుగా లికనిపించును

౩ అక్టోబరు ఆ శు ౪ ఆదివారము ఈదినము వడి పుగాలి, వృష్టితోగలిసి యుండును

౪. అక్టోబరు ఆ శు ౫ సోమవారము ఈదిన మామొదలైన దినములవరకు చల్లగాను, హిమము, వర్షముతో కూడుకొనియుండును. నేటివాతావరణములో శీతము హెచ్చుగు కొద్దివృష్టికలుగును.

౫ అక్టోబరు ఆ శు ౬ మంగళవారము ఈదినము శీతము గానుండును, వృష్టికొద్దిగ కలుగును.

౬ అక్టోబరు ఆ శు ౭ బుధవారము ఈదినము కొంతశీతముతగ్గి నస్సువ కల్లాసముగనుండును కొద్దివర్షములు కూడ కలుగును.

౭ అక్టోబరు ఆ శు ౮ గురువారము ఈదినము వెనుకటిస్థితియే యుండునుగాని ఉష్ణముకొద్దిగ హెచ్చును

౮ అక్టోబరు ఆ శు ౯ ౧౦ శుక్రవారము ఈదినము, గాలి, మంచుతోకూడ కొద్దివర్షములు కలుగును.

---

# విజ్ఞానవర్ధని

## ■ ఆచార స్వీకరణము

హిందూస్థానములో నూర్లకొలది సంవత్సరాలుగా కలిసి మెలిసియుండుటచేత హిందూ ముస్లీములలో పరస్పరముగా ఆచారములనుస్వీకరించుట అన్నిప్రాంతాలలో సాధారణమైయుండెను. ఈ ౫౦ ఏండ్లనుండి మరల ఉభయులలో భేదాలు బాగా వృద్ధిపొందుచూవున్నవి. కారణం? పాకిస్థాన్ చరిత్రను గమనించేవారికి సువ్యక్తము! ఇప్పటికిన్నీ ముస్లింఫకీరులు కొందరు బైరాగులవలె బూడిద పూసుకొంటారు. పంజాబులో సఖీసర్వర్ అను పూజాస్థానమునకు హిందువులు ముస్లిములు సమానముగా వెళ్లి కొలుతురు. అఖండముగా అగ్నిని ముస్లిములు కొన్నితావులలో కాపాడుచున్నారు. పంజాబులోని జాంగ్‌జిల్లాలో సాదిఖ్ నిహాంగ్ అను పూజాస్థానములో ముస్లింఫకీరులు "ధునీ"అను పేరుతో రాత్రింబవళ్లు అగ్నిని వెలిగించుచున్నారు.

## ■ తిరుగుడులేని మతపరివర్తనము.

అన్నిమతాలవారు యితరమతస్థులను తమ తమ మతాలలోనికి మార్చినప్పుడు ఏదోఒకతంతు చేయుచుందురు క్రైస్తవులు బాప్టిజం అనుపేరుతో ఒకగుంటలోని నీటిలో కొత్తభక్తులను ముంచి తేల్తురు ముసల్మానులు "ఖత్నా"అను చర్మకర్తనక్రియను చేయుదురు ఆర్యసమాజీయులు శుద్ధిచేయుదురు. హిందువులు నాలుకనునాజూకుగా కాల్చిపంచగవ్యము త్రిపింతురు. వైష్ణవులు మాధ్వులు భుజాలమీదకాల్తురు శైవులు లింగాలను మెడలోకట్టుదురు కొందరు జుట్టుపెట్టింతురు కొందరు గడ్డాలు పెంతురు కొందరునామాలుపెట్టింతురు. కొందరు పుట్టుపేర్లనుమార్తురు, కొందరుదుస్తులను మార్తురు. ఈవిధముగా కొత్తమత ప్రచ్చకొన్నవారికి ఒక్కొక్కప్పుడు పేరుతోను స్వరూపము, వేషము, భాష మారి యమయాతనలగునట్లు అంతేకాదు పూజలుచేయునప్పుడువారిచేతఒక్కొక్కమతమువారుఒక్కొక్కవిధముగ డ్రిల్లు చేయింతురు. సిక్కుమతమువారు తమమతములో చేరినవారికి కొన్ని కొత్తనియమాలనిత్తురు. ముసల్మానులు సిక్కులుకాదలచితే సిక్కులుకాళ్లుకడిగిననీటిలో పదిరక్తముకలిపి వారిని త్రాగుమందురు. హిందువులు తమమతములో చేరదలచితే ఆదేశాలికముగులో ఆవురక్తముకలిపి తీర్థముగా పుచ్చుకొమందురు! ఈవిధముగా మతముద్రవేసినతర్వాత మరలవారు తమ పూర్వమతాలలోనికి పోరు అని వారిభావన!

## ■ సువర్ణద్వీపము.

దీనినే ఇప్పుడు సుమత్రాఅందురు క్రీ-శ-౬౪౧లో ఆద్వీపమందు అందరున్నూ బౌద్ధులే. అంతకుముందు అందరున్నూ హిందువులే (౨౦౦వ మనువ్యభాదులగు ఆదిమనుష్యులున్నూ ఉండిరి) బీహారులోని విక్రమశిలలోని అతిశ అను బౌద్ధుడు తనబౌద్ధవిద్యను ౧౨ఏండ్లపాటు సువర్ణద్వీపములో ఉండి అచ్చటి ఆచార్యచంద్రకీర్తి అను మతగురువువద్ద నేర్చుకొనెను

---

# బెంగాలులో నిరాహారులమరణాలు

బొంబాయినగరములో ఈసెప్టెంబరు ౧౪ తేదీ సాయంకాలము దేశమునకు సంప్రాప్తించియున్న ఆహారపదార్థ విషయమును చిక్కుముడివిప్పి ఆలోచించుటకై, "ఫుడ్‌కౌన్సిల్ ఆప్ పోసల్" వెల్ఫేర్ అసోసియేషను, మన్నగు ౧౭సంస్థలుకలిసి ఏర్పాటుచేసిన బహిరంగసభకు అధ్యక్షతవహించిన యన్.యం.జోషిగారు తమఅధ్యక్షోపన్యాసమునందు దేశమంతటికిని ఆహారపు ధాన్యములను అందునట్లు చేయుటకు అంతటను ఒక్కపద్ధతి ప్రకారము పంపిణిచేయుటకు కేంద్రప్రభుత్వమే స్వయముగా భారమువహించవలెననియు వెంటనే రాజకీయ ఖైదీలను విడుదలచేసి ఇప్పటిరాజకీయ వాతావరణమునుమార్చివేసి ప్రజలసహకారమును సంపాదించవలెననియు సూచనచేసిరి.

* *

కలకత్తా, సెప్టంబరు౧౦

నిన్న కలకత్తాలోని రెండుఆస్పత్రులలో ౧౯మంది తుష్పోషితులైనరోగులు చేర్చబడిరి. కలకత్తాలోని అయిదుఆస్పత్రులలో అట్టివారలు ౪౧ మందిమరణించిరి ఆ ఆస్పత్రులనుండి ౯౦మంది వదిలిపెట్టబడిరి.

* *

బంకూరాలో సెప్టంబరు౫ ఒకేరోజులో ౨౦ మంది మరణించినారు

దినాజ్‌పూరుజిల్లాలో బాలూర్ఘాట్లో ౧౭మంది, దినాజుపూరులో౧౩మంది. ఫుల్‌హాట్‌లోను రైల్వేబజారులోను ౭గురును తిండిలేక మరణించినారు.

* *

ఆసాంలో తెలంపూరుమడివచ్చిన ఒకవాన్ల ఆపట్టణములను పెనరాష్ట్రముచంపవచ్చితిండిలేక అనే అరుపులకు చిన్నది తెలిపెన్నడి.

* *

సెప్టెంబరు౧౧తేదీతో అతమగోరమును కలకత్తాలో హిందూసత్కార సమితివారును అంజుమనాముఫిదుల్ ఇస్లాంవారును కలిసి ౨౦౪ శవములకు సంస్కారమును చేసివేసిరి ఈ శవములలో ౧౩౨ పోలీసులుతెచ్చినట్టివి ౭౨యుమువైద్యఆస్పత్రులనుండి వచ్చినట్టివి

* *

అంధేరి సెప్టెంబరు౧౫

ఇక్కడ సుందరాబాయి అనునామెభర్తకై, ఆయన ఆస్పత్రిలో జబ్బుపడియుండగా,ఇంటిలో సంపాదించువారెవరును లేకపోవుటచే కుటుంబమునుపోషించుకొనలేక ఆమెతనకుమారైను ఒకమహమ్మదీయునికి రూ ౨౦లకు అమ్మివేసినట్లు ఆమెయేనేను పోలీసులకుచెప్పినది ఈవిక్రయము జరిగినరెండునెలలకు ఆమెభర్తవచ్చి పిల్ల ఎక్కడ అనుగా ఆమెకంటనీరుబెట్టి విక్రయించినట్లు తెలిపెను. అతను అంధేరి పోలీసులకు తెలియజేయగా, ఆమహమ్మదీయునినుండి ఆబాలికను తిరిగిసంపాదించిరి. ఆమహమ్మదీయుడు బాలికను ఆ తల్లి తనకువిక్రయించినట్లు స్టాంపుఅంటించినవిక్రయపత్రము చెనవద్దయున్నదికనుక తానాబాలికను యిచ్చివేయజాలనని చెప్పెనట. (ఫ్రీప్రెసుజర్నల్)

సెప్టంబరు౧౫తేదీన కలకత్తా నగరంలో అయిదుఆస్పత్రులలో చేర్చబడిన తిండిలేనివారలు ౫౬మంది మరణించిరి.

* *

సెప్టంబరు మొదటివారములో నిరాహారులైన ౯మందిని వీధులనుండితీసికొనిపోయి బోగ్రా ఆస్పత్రిలో చేర్పగా, వారలలోఇరువురుమరణించిరి. ఆదివారమందు వీధులలో ముగ్గురుమరణించిరి. ఇట్లు ఆపట్టణములో మొత్తము ౨౪ మంది మరణించినారు.

* *

సెప్టంబరు ౧౧ తేదీతో ముగియు వారములో నిరాహారులై ౩౫మంది మరణించిరి, దౌర్బల్యము వల్ల ౧౧మంది మరణించిరి.

ఢాకాలో సెప్టంబరు ౧౫తేదిరాత్రి రెండుగం. వేళ మునిసిపల్ వీధిలో ఒకయింటిపైకి ౩౦౦మంది పోయి ధాన్యమునుగులబియ్యమును దోచుకొనిరి అది కొందరుకంట్రాక్టరులదట. దానిని పోలీసులు జప్తుచేసియుండిరి. ఆరాత్రియే ఈదోపిడి జరిగెను. ఇందుకైనేదుదయము ఒకడు అరెస్టు చేయబడినాడు.

* *

మదారిపూరు, సెప్టెంబరు౧౬

ఇక్కడివీధులనుండి ౧౫మందిశవములు తీయబడినవి, పోయినఆగష్టునెలలో అట్టి ౧౨౫శవములు వీధులనుండి తీయబడినవి.

ఇటీవల మునిసిపల్ మార్కెటు ఆవరణసమీపమున నిరాహారుడైన ఒకబాలుని నక్కలు తినినవి.

ఇక్కడ నిరాహారులై మరణించుచున్నవారల శవములను అధికముగా నదులలోత్రోయుటయో లేక పూడ్చిపెట్టుటయోజరుగుచున్నది. కట్టెలు చిక్కనందువల్ల హిందూశవములను దహనముచేయుటకుకష్టమేర్పడినది. కలరా, జలోదరము, గ్రహణులవల్ల అనేకులు మరణించుచున్నారు.

మున్షీగంజి గురువారమునాడు మున్షీగంజి పట్టణములో ఆరో మువ్వురు ముగ్గురు మరణించిరి. ఈజిల్లాగ్రామాలలో ఆహారములేక జనులుమరణించుచున్నారు.

కూర్గ్రామం లాల్. మన్గర్ పోలీసుస్టేషను అధికారములోనుండు చిఠాతూలితాజ్పూరు గ్రామములో పల్వుమరణించినారు ఆపట్టణమునందు రోడ్డువెంట మొన్నరోజొకడు నిరాహారుడుపడి మరణించినాడు

పాట్నా. ఒకరమునాడు పదిమంది నిరాహారులు మరణించినారు

* *

కలకత్తా, సెప్టెంబరు౧౯

ఇక్కడ అయిదుఆస్పత్రులలో సెప్టంబరు౧౯ తేదిన ౫౦మందిమరణించిరి ఈఆస్పత్రులనుండి ఆ రోజు ౧౧౦మంది వదలిపెట్టబడిరి శనివారమునాడు పోలీసులు ౨౬శవములను కలకత్తావీధులనుండి ఎత్తివేయించిరి. సెప్టెంబరు౧౯తేదిన పోలీసులు అట్టి౪౯శవములను సాయంకాలము ౫గంటలవరకు తీసివేయించిరి.

(౬ వ పేజీ చూడుడు

